# సద్గురు శ్రీమలయాళస్వామి

– ఆచార్య శ్రీఓంకారానందగిరిస్వామి

భగవంతుడు ధర్మమును కాపాడుటకు **“దైవం మానుష రూపేణ”** అన్నట్టుగా భూలోకంలో స్వయముగా తానే **“సద్గురువుగా”** అవతరిస్తాడు. లేదా ఒక మహనీయుని భూలోకమునకు పంపి వారి ద్వారా లోకమును ప్రభావితం చేయిస్తాడు. భగవంతుని యొక్క సంపూర్ణ అనుగ్రహమును పొంది మహాపురుషులు భువిన అవతరించి, మానవులకు **కర్మ–భక్తి–జ్ఞాన–యోగములను** తెలియజేసి, ధర్మమును నాలుగు పాదాలయందు సుప్రతిష్ఠము గావిస్తారు.

పరమశివుని సంకల్పముచే **“సద్గురువులు”** భూలోకంలో అవతరించి, ఈశ్వరార్పిత కార్యములను పూర్తిచేసి తిరిగి ఆనందలోకమునకు వెళ్లారు. ఇలా ఈశ్వరాజ్ఞచే భువిన జనించిన ప్రాతః స్మరణీయులలో శ్రీమలయాళ యతీంద్రులు సుప్రసిద్ధులు. వారు చేసిన లోకోపకార్యములు వెన్నోళ్ళ కొనియాడతగినవి. అందరిచే భగవద్గీతను పఠింపజేసి **“గీతాచార్యునిగా”** పిలువబడ్డారు. **“ఒకే కులము, ఒకే మతము, ఒకే దైవము”** అని వెలుగెత్తి చాటిన ఆ మహాపురుషుడు నిత్యప్రాతః స్మరణీయుడు. ఆంధ్రదేశమున వైదిక సత్య, ధర్మ, ప్రతిష్ఠలను గావించి ఆంధ్రదేశోద్ధారకుడిగా నీరాజనాలు అందుకొన్న మహనీయ యతిపుంగవుల యొక్క నామసంస్మరణచే ఆంధ్రావని పునీత(మైనది) మౌతున్నది.

నాడు అద్వైతమును ఆ సేతుహిమాచలపర్యంతం ప్రచారప్రసారము గావించిన శ్రీశంకరులు **“జగద్గురువు”** గా కీర్తింపబడ్డారు. నేడు అద్వైతమును ఆలంభనగా చేసుకొని అందరికి ఆ తత్త్వమును సువిదితము చేసి, భగవద్గీతను పఠింపజేసిన శ్రీమలయాళమౌనీంద్రులు **“సద్గురువు”** గా ముముక్షువుల హృదయపీఠాలను అధిష్ఠించారు.

“సద్గురువు” అనగా? **“వేదవిదుడూ, పాపరహితుడూ, కామనారహితుడూ, బ్రహ్మనిష్ఠుడూ, పరమశాంతుడూ, కరుణాసముద్రుడూ, ఆశ్రితరక్షకుడూ, భేదరహితుడూ”** అయినవాడే సద్గురువు. ఇట్టి లక్షణయుక్త శ్రీమలయాళయతీంద్రుల జీవిత ఘట్టాలను కొంత తెలుసుకుందాం.

1) **వేదవిదుడూ** : –

భారతీయ ఆర్షసంప్రదాయానికి మూలం వేదము. భారతీయుల మతగ్రంథమైన వేదము శిక్షా, వ్యాకరణం, ఛందస్సు, నిరుక్తం, జ్యోతిషం, కల్పము అనే ఆరు అంగాలతో కూడి ఉంటుంది. వేదమనగా ధర్మ–అర్థ–కామ–మోక్షములను తెలుపుతూ, అలౌకిక ఉపాయములను ఏది బోధిస్తుందో అది వేదము. వేదవిదుడనగా వేదమును క్షుణ్ణముగా ఎరిగినవాడని అర్థం.

సద్గురు శ్రీమలయాళస్వాములవారు తమ ఆధ్యాత్మిక జీవితమును శ్రీసిద్ధశివలింగ గురుదేవుల దగ్గర ఆరంభిస్తూ, వారి ద్వారా వేదము యొక్క సూక్ష్మార్థమును గ్రహించి, తద్దంగభూతములైన శిక్షావ్యాకరణాదిషడంగాలను, ఉపనిషత్తులను, షడ్దర్శనములను, కావ్యాలను అభ్యసించి గురుకృపకు పాత్రులైనారు. అలా వేదమును అభ్యసించి, కాలాంతరములో తమజీవితపర్యంతం వేదము యొక్క ముఖ్యోద్దేశమును ఆంధ్రజనులకు తెలిపి, అందరిని వేదాంతమార్గములో ప్రవేశింపజేశారు.  కులవివక్ష లేకుండా అందరికీ వేదవిద్యను అందించి **"వేదపురుషుడిగా"** కీర్తి గడించిరి. దురవగాహ్యమైన ఆత్మవిద్యను సులభరీతిలో అనేక ఉపమానాలతో ఆంధ్రజనులకు బోధించి, అందరిని **"ఆత్మోన్ముఖులుగా"** చేశారు.

వేదవిద్యను ఘంటాపథంగా శ్రీసనాతన వేదంతాజ్ఞానసభలు, శ్రీచాతుర్మాస్య మహావ్రతాలు, ఓంకార సత్రయాగాల ద్వారా అందరికి తెలియజేశారు. వేదములో ఉండే నైతికవిలువలు మొదలు ఆత్మసాక్షాత్కార పర్యంతం ఆచరించవలసిన నియమాలను అందరికి సువిదితము గావించారు. వేదవిద్యను తమ సుమధురకంఠంతో ఆలపించి **"వేదవిదుడూ"**గా కీర్తింపబడ్డారు శ్రీమలయాళయతీంద్రులు.

2) **పాపరహితుడూ** :–

శాస్త్రవిహిత కర్మానుష్ఠానమును వదిలి, నిషిద్ధకర్మాచరణం వల్ల కలిగే ఫలమును "పాపము" అంటారు. పాపము ద్వారా మనుజుడు దుఃఖమును, నరకాదిలోకములను పొందవలసి ఉంటుంది. పాప కర్మాచరణ నిమ్నయోనిలకు కారణమవుతుంది. నిమ్నయోని గమనం సర్వదా దుఃఖాలకు నిలయం. గావున పాపసంబద్ధ లేశము లేకుండా ఉండుటకు మహాపురుషులు ప్రయత్నిస్తారు.

పవిత్రజీవితమును గడుపుటకు నిశ్చయించుకున్న మహనీయుని ప్రతికర్మలు యజ్ఞరూపములుగా ఉంటాయి. వారు ఆచరించే ప్రతి కర్మాచరణం శాస్త్రవిహితంగా ఉంటుంది. శాస్త్రవిహితకర్మానుష్ఠానమే పాపరహితమునకు హేతువు అవుతుంది. ఇట్టి వ్యక్తి మాత్రమే సద్గురువుగా కీర్తింపబడతాడు.

శ్రీమలయాళస్వాములవారు తమ జీవిత పర్యంతం ఏనాడైన నిషిద్ధకర్మలను చేశాడని మనము విని యుండలేదు. వారు చేసిన ప్రతికర్మ శాస్త్ర సహేతుకమేనని మన మందరము ఎరుగుదుము. స్వామి వారు ఆచరించే కర్మలలో ఏదో ఒక విశిష్టత, నైపుణ్యం, బుద్ధికుశలత ద్యోతకమయ్యేది. నిషిద్ధకర్మలను తాను చేయక శిష్యులచే అట్టి కర్మలను చేయించక, ఒకవేళ శిష్యులు అట్టి కర్మలను చేస్తే వారికి ప్రాయశ్చిత్తము విధించి, పాపపంకిలమును తొలగించుటకు యత్నించెడివారు. ఇట్టి గుణయుక్తులు పాపరహితులూ అనటంలో అతిశయోక్తి ఏమున్నది.

3) **కామనారహితుడూ : –**

కామనా అనగా కోరిక. అది లేని వాడు కామనారహితుడూ. కోరిక, ఇచ్ఛా, విషయములు అవిద్యవంతులకు ఉంటాయి గాని విద్యవంతులకు గాదు. రజో గుణప్రధానయుక్తుడికి **"కామనా"** అధికముగా ఉంటుంది. త్రిగుణములలో ఏ ఒక్క గుణము ఉన్న కామనకు హేతువవుతుంది. విశుద్ధసత్త్వగుణయుక్తుడికి కామనలు దగ్ధపటన్యాయానుసారం భస్మీభూతమై ఉంటాయి. గావున కామనా శూన్యుడై ఉంటాడు విశుద్ధసత్త్వగుణయుక్తుడు. బీజము అగ్ని సంపర్కముచే మళ్ళీ ఏవిధముగా మొలకెత్తదో, అదేవిధంగా జ్ఞానాగ్ని సంపర్కము గల మహాపురుషుని హృదయంలో కామనాబీజం అంకురించదు.

శ్రీవారి జీవితమును పరిశీలించినచో వారి **"కామనా శూన్యత"** స్పష్టముగా గోచరిస్తుంది. వారు ఏనాడు కామనలు గలిగి చరించలేదు. కామనలకు సంకల్పము మూలకారణమవుతుంది. శ్రీవారు **"నిస్సంకల్పులు"** అవ్వడం వల్ల కామనలకు వారి హృదయంలో అవకాశమే లేదు. అతీతవైరాగ్యులు గావున ఇహ, పరలోక విషయాలకు అతీతులని ఎరుగవలెను. ఆశ్రమమునకు ఎందరో భక్తులు ఎన్నోవస్తువులను తెచ్చి ఇస్తున్నప్పటికీ, వాటి యందు నిర్లిప్తత భావం కలిగి

ఉండేవారు. శ్రీవారు ఏ రోజు ఇది కావాలని అడిగి ఎరుగరు కూడ. ఇట్టి శ్రీవారు కామనారహితులూ అనడంలో సందేహము లేదు.

4) బ్రహ్మనిష్ఠుడూ : –

బ్రహ్మయందు స్థిరమైన చిత్తము గలిగి తన్నిష్ఠాపరుడుని బ్రహ్మనిష్ఠుడని ఎరుగవలెను. నిరంతరం బ్రహ్మయందు నిష్ఠ గలిగి చరించే వారిని బ్రహ్మనిష్ఠుడని అంటారు. ఈ బ్రహ్మనిష్ఠత అనునది బహుదుర్లభము. ఏ కొందరో ఈ స్థితిలో ఉంటారు. బ్రహ్మనిష్ఠతకు విద్య, తపస్సులు గలిగిన వారు మాత్రమే అట్టి నిష్ఠలో ఉండగలరు. ఇట్టి వారినే బ్రహ్మనిష్ఠులని చెప్పవలెను. అన్యులను గాదు.

శ్రీవారు శ్రీసిద్ధశివలింగ గురువర్యుల దగ్గర శ్రుతిస్మృత్యాది గ్రంథాలను కులంకశంగా చదివి, వాటిలో గల భావగంభీరతను, నిగూఢతత్త్వమును తెలుసుకొని, యావత్ భారతదేశమంతటా పాదచారియై సంచరించి, 12 వత్సరములు తిరుమల గోగర్భంలో "తపము" ఆచరించి, అట్టి మహోన్నత బ్రహ్మనిష్ఠపదవిని పొందిన మహాపురుషులు. అనితరసాధ్య ఆత్మసాక్షాత్కారమును బడసి, నిరంతరం బ్రహ్మనిష్ఠ గలిగి యావదాంధ్రదేశముముక్షువులను బ్రహ్మనిష్ఠయందు విహరింపజేసిన అస్మత్ పరమ గురుదేవులు బ్రహ్మనిష్ఠులూ అనడంలో ఆశ్చర్యం ఏమున్నది.

5) పరమశాంతుడూ : –

విద్య, తపస్సులు గలిగి బ్రహ్మనిష్ఠను పొందిన వ్యక్తి మాత్రమే పరమశాంతిని పొందగలడు. నిరంతరం ఆత్మయందు రమించడం, క్రీడించడం వల్ల ఇతడు పరమశాంతిని పొందుతాడు. పరమశాంతిని పొందుటకు ఇటువంటు అభ్యాసం తప్పనిసరి అని శాస్త్రాలు తెలుపుతున్నాయి.

సముద్రములో అనేక నదులు వచ్చి చేరినప్పటికీ సముద్రము ఏ మాత్రము తన గంభీరతను, ఆధిక్య, న్యూనతలను పొందదో, అదేవిధముగా శ్రీవారు కూడ ఆశ్రమంలో అనేక కార్యాలు నిర్వర్తిస్తున్నప్పటికీ, అనేక ఒడిదుడుకులు ఎదురైనప్పటికీ ఏ మాత్రము శాంతిని కోల్పోక, చూచేవారికి ప్రసన్నవదనహృదయులుగా, పరమశాంతులుగా గోచరించేవారు. శ్రీవారి

ముఖసందర్శన అశాంతిని, ఆవేదనను తొలగించేది. ఆ దివ్యమంగళ స్వరూపాన్ని వీక్షించుటకు భక్తులు ఎదురుచూచేవారు. ఇట్టి దివ్యమంగళస్వరూపయుక్తులు పరమశాంతులూ అనడంలో విశేషమేమున్నది.

6) **కరుణాసముద్రుడూ : –**

ప్రతి మానవునికి సహజంగా ఉండవలసిన గుణం కరుణ. "**ఆత్మవత్ సర్వభూతాని**" తనవలే సర్వభూతాలను దర్శిస్తూ, ఎదుటివారికి కలిగే దుఃఖాలను తనకు కలిగిన వలే చింతించి తన్నివారణకు ప్రయత్నము గావించేవాడు ఉత్తముడు. కరుణ గల హృదయం భగవత్ తత్త్వాన్ని అవగతం చేసుకుంటుంది. కరుణ మహనీయులకు స్వభావమై ఉంటుంది. శ్రీమలయాళస్వాముల వారు చిన్నప్పుడు పాఠశాలకు వెళ్ళుతుండగా ఒక బోయవాడు పావురాలను అమ్మటానికి ప్రయత్నిస్తున్న వేళ స్వామి వారు ఆ దృశ్యాన్ని చూచి, హృదయం కరిగి, ఇంటినుండి డబ్బులు తెచ్చి, బోయవానికి ఇచ్చి ఆ పావురాలకు స్వేచ్ఛను కలిగించాడు. ఈ ఘటం స్వామి వారి చరిత్రలో విశేషమైనది. అప్పుడే "**దయగల హృదయమే భగవన్నిలయము**" అనే అమృతవాక్కు మనకు అందింది. ఎవరి హృదయం దయను కలిగి ఉంటుందో వారి హృదయంలో భగవంతుడు నివాసము చేస్తాడని శ్రీవారు తెలిపారు.

శ్రీవారి హృదయం కరుణకు నిలయమైనందున శ్రీవారిని "**చరాచరసుఖాభిలాషి**" అని ఆంధ్రజనులు పొగిడిరి. చరాచరములయందు కూడ అత్యంత కరుణహృదయులై సముద్రాన్ని తలపిస్తున్నట్టు శ్రీవారు ఉండేవారు. ఇట్టి నామము శ్రీవారికి మత్రమే సార్థకమై వెలుగొందింది.

7) **ఆశ్రిత రక్షకుడూ : –**

ఎవరి హృదయం కరుణాపూర్ణమై ఉంటుందో అట్టి వ్యక్తి తనను ఆశ్రయించిన వారిని సంరక్షిస్తాడు. శ్రీవారు తనను ఆశ్రయించిన బ్రహ్మచారులకు, సన్న్యాసులకు ఆశ్రయమును కలిపిస్తూ వారిని సంరక్షించేవారు. నేటికి తనను ఆశ్రయించిన భక్తులను అదృశ్యరూపంలో ఉంటూ కాపాడుతున్నారు. ఉభయాంధ్రప్రజలు "**గీతాచార్యులుగా**" స్వామి వారిని తమ గృహంలో ఉంచుకొని ఆరాధ్యదైవంగా పూజిస్తూ, సమస్త అభీష్టములను, ఐహిక, ఆముష్మిక ఫలములను

పొందుతున్నారు. సమస్త అభీష్టములతో పాటు భక్తి, జ్ఞాన, వైరాగ్యాలను అనుగ్రహిస్తున్నారు శ్రీమలయాళయతీంద్రులు.

8) **భేదరహితుడూ :-**

**"అభేదదృష్టి జ్ఞానం, భేదదృష్టి అజ్ఞానం."** మహనీయులు సర్వదా సర్వకాలాలలో అభేదజ్ఞానం కలిగి లౌకిక కార్యాలు ఆచరిస్తుంటారు. అభేదజ్ఞానం కలిగిన వారు సమస్తభూతాలలో అఖండ చైతన్యమును దర్శిస్తూ, సర్వభూతాలను తనవలె చూసుకుంటారు. ఇట్టి వారు యథార్థస్వరూపగ్రహణసామర్థులై ఆత్మయందు చరిస్తారు. ఇక **భేద**జ్ఞానం కలిగినవారు తనకంటే సర్వభూతాలను వేరుగా చూసుకుంటూ భ్రాంతిని కలిగి దుఃఖమును పొందుతారు.

శ్రీవారు తమజీవిత పర్యంతం ఏనాడు భేదదృష్టిని చూసి ఎరుగరు. వారు సర్వదా సర్వకాలాలలో భేదరహితులై ఉండేవారు. ఆశ్రమానికి ఎవరు వచ్చిన వారిని పరమాత్మస్వరూపులుగా భావించి తత్త్వమును తెలిపేవారు. చర్మ, గుణ దృష్టులను వదిలి జ్ఞానదృష్టితో అందరిని సమానంగా చూచేవారు. ఒకే కులము, ఒకే మతము, ఒకే దేవుడు అనే నియమాలను ఆధారంగా చేసుకుని శ్రీవ్యాసాశ్రమ సంస్థ ఆశయాలను అంతటా విస్తరింపజేశారు. శ్రీవారి మాటలలో, చేతలలో కూడ భేదజ్ఞానం ద్యోతకమయ్యేది కాదు. వారి ప్రతిమాట, చేతలలో అభేదజ్ఞానం తొణికిసలాడేది. అంతటా అభేదజ్ఞానమును దర్శించేవారు కనుకనే ఆంధ్రావని ఆ యతీంద్రులను "మహర్షి" అని కీర్తించారు. అభేదజ్ఞానం కలిగిన వారు **"మహర్షి, సద్గురువుగా"** పిలువబడతారని తమ అలౌకిక కార్యాల వల్ల తెలియజేశారు. అంతే కాకుండా స్త్రీ, పురుష వివక్ష లేకుండా అందరికి సమానంగా బ్రహ్మవిద్యను అందించి అభేదజ్ఞానానికి నిలువెత్తు నిదర్శనంగా నిలిచారు శ్రీమలయాళయతీంద్రులు.

పై అష్టవిధగుణలక్షణయుక్తులగు స్వామివారు **"సద్గురువు"**గా కీర్తింపబడి మనందరి హృదయాలలో చిరస్థాయిగా నిలిచిపోయారు.

ఇక శ్రీమలయాళస్వామి అను నామం తిరుమల గోగర్భంలో తపము ఆచరిస్తున్నవేళ, రోజు మందిరమునకు వెళ్ళి ప్రసాదము స్వీకరిస్తున్న సమయంలో అప్పటి **"రామ్ లకణ్ మహంతు"** గారు

మొదటిసారి శ్రీవారిని **"శ్రీమలయాళస్వామి"** అని పిలిచారు. ఆ నామమే స్వామివారికి చిరస్థాయిగా ఉండిపోయింది. తమ సన్న్యాసనామము **"శ్రీఅసంగానందగిరిస్వామి"** అయినప్పటికీ, మలయాళస్వామిగానే ఆంధ్రావనికి సుపరిచితులైయారు. అప్పటి నుండి **"సద్గురు శ్రీమలయాళస్వామి"** అని అనడం భక్తులకు పరిపాటి అయ్యింది.

**"సద్గురు శ్రీమలయాళస్వామి"** నామ వైశిష్ట్యాన్ని వివరింప నేనంతటి వాడను. ఆ మహనీయుని గుణగణాలను కీర్తింప సహస్రఫణి అయిన ఆదిశేషుడికి గూడ సాధ్యము గాదు. ఏదో ఉడతా భక్తిగా అవ్యాజమైన భక్తిప్రపత్తులచే శ్రీవారిని స్తుతించిన నా వాక్కు పవిత్రతను నొందును గాక! నా హృదయమాలిన్య నివారణకు ఆ యతీంద్రుల గుణస్తుతి హేతువవుగాక!!

ఓం తత్ సత్ ఓం